## బెన్‌జాన్సను. 1573-1637.

ఆంగ్లమహాకవులలో సకుంఠితపాండిత్య విలసితులగు క్రొద్దిమందిలో జాన్సను ఒకడు. లండనులో పుట్టిపెరిగి కొంత కాలము నటవృత్తిలో గడిపి 1598 లగాయతు Every man in his humour, Cynthia's Revels మున్నగు ప్రహసనములను రచించెను. షేక్స్పియరుమహాకవి వీనిలో కొన్ని పాత్రలగైకొని యభినయించుచుండెను. 1603 లో సెజేనసు అను విషాదనాటకమును ముప్పదిమాన్యుఁలను రచించెను. తరువాత Silent woman, Alchemist, Catalian మున్నగు నాటకములరచించి కొంతకాలము యూరపులో సంచరించి యావల నాంగ్లదేశపు యాస్థానకవిమాలికగ వాసికెక్కి కొండొక కాలమునకు పేదయై యిడుమలగుడిచి మృతినొందెను.

రూపకరచనమందు జాన్సనుభావ కవిత్వమున కెక్కువ యవకాశము లేకుండచేను. కథాసంవిధానమందు ప్రధానోద్దేశమునకు ననుకారిక వృత్తమునకు కథాంశములు స్పష్టముగ నూటిగ బ్రవర్తించు సంధిలక్షణములను చక్కగపాటించి రచించెను. ఇతని శైలి సుభువగు తేలికపదములతో కొద్దిలో నెక్కువ భావమును తెలుపు పరభావ సౌలభ్యమున జెన్నొందెను. ఇట్టి భాషాప్రయోగవైదుష్య మాంగ్లరచయితలలో బేనుతత్త్వజ్ఞున కొకనికే చెల్లియున్నది.

## జానువెబ్బరు. 1580-1625.

ఈకవి మూడువిషాద నాటకములను మూడుహాస్యరూపకములను రచించెను. అందు వర్జినియా తెల్లదయ్యము వ్యాఖ్యానగౌరవ మొందుచున్నవి. ఈతనికి సమకాలిక రూపక

కవులతోఁజేరి మరికొన్నినాటకముల రచించెను. కరుణా భయానకరసములను దిగులు పట్టులను వెకిలిహాస్యమును పని వడి నేర్పొప్ప జిత్రించుచుపోయెడ. మెలోడ్రామాకు మహానాటకముల భావగాంభీర్యమును లలితరస వత్కావ్యసౌందర్యమును అతికించి వన్నెవెట్టెను. తని కధాకల్పనము సంధి దోషములచే నంత మనోహరముగ లేదు. పాత్రస్వభావములలో నిలుకడ యగుపడదు.

మెస్సెంజరు. 1583-1640.

ఈకవి 15 నాటకముల రచించెను. వీనిలో సమకాలికసంఘ వృత్తాంతములు హోగార్తు చిత్రములందువలె తెలువొప్ప జిత్రింపబడినవి. కధా పోషణమందీతను కడునేర్పరి. ఈతని నాటకములలో A new way to pay old dedts అనునది యుత్తమకావ్యమైయున్నది.

1584-1616 బోమాన్ ఫ్లెచ్చరు జంటకవులు.

వీరి సాంగత్యము తిరుపతివెంకటకవులవలె సత్కావ్యఫలదాయకమై లోకఖ్యాతమిత్ర సత్వమున రాజిల్లుచుండెను. బోమాన్ జాన్సను రూపకములకు నాంది ప్రస్తావన రచించుచుండెను. వీని రూపకములలో అల్లికబిగివి లేకున్నను పాత్రములు కధాసందర్భములు చక్కని పరిజ్ఞానముతో గల్పింపబడెను. కరుణారసము చక్కగ విప్పించుచు నాత్మీయభావవిలాసములు తడియారు లేతవలుకులతో ముద్దుగ ముచ్చటించబడినవి. ఔచిత్యము లేతహాస్యము వీనిముఖ్య లక్షణములు. ఈజంట కవుల నాటకములలో Philaster, Maids Tragedy, ప్రధాన గౌరవ మొందుచున్నవి. బోమ్మను స్వతంత్రముగ రచించిన

ములలో Women hater, A king and no king ముఖ్యమైనవి. ఫ్లెచ్చరు వ్రాసిన సొంతనాటకములలో Captain Cupids revenge ముఖ్యములు. వీరి కల్పనలు షేక్స్పియరు మహాకవిచే విస్తారముగ నుపయోగింపబడినవి.

రోమకకవి సెనీకా భయానకరసము పోషించునందున నాటకములకేర్పడు కథాసౌందర్యమును నిదర్శించి యున్నాడు. బొమన్ జాన్సను మున్నగువారి రూపకములందు పాత్రస్వభావము విశదముగ విస్తరింప బడినది. భాషాసౌకర్యమేర్పడినది. లలితరూపకమర్యాదలు చిగురెత్తి చెలువొందుచుండెను. ప్రహసనముల సామాన్యలక్షణ మింతవరకు వస్తుస్వరూపము స్వభావసిద్ధముగ జిత్రించుచు ప్రాకృతగుణంబుల హాస్యజాతీయములు జెప్పు కల్పనరీతియై యుండెను. గభీరభావోద్దీపనము మహానాటకముల లక్షణమై యుండెను. షేక్స్పియరు మహాకవి ఈరెంటిని సమన్వయించి క్రొత్తదారుల ద్రొక్కి సర్వ జనాదరణీయమగు నాటకముల రచింపగలిగెను. వీరి శృంగారగాథలు ఆకాలమందు జనాభీష్ట మొందుచుండెను. షేక్స్పియరు ఆకాలమునకు రుచించిన కథలనే తన నాటకములం దుపయోగించి యున్నాడు కాని యాతని ప్రతిభావైశద్య మనంతము స్వభావ పరిజ్ఞాన మపారము. కరుణాప్రవృత్తి లౌకిక జగద్వ్యాప్తి సహృదయమున రాజిల్లుచున్నవి. కథాకల్పన చాతుర్య మపూర్వము, నిరుపమానము, అద్వితీయము. భాషానతిపక్వమై తలపుల వెన్నంటి సిరాఘాటు సార్వత్రిక సంచార కౌశల్యమున సొంపెసగుచుండెను. ఇట్టి మహాకవి లక్షణంబు లొదవిన షేక్స్పియరు భారత తత్త్వపు

మానవావతారమూర్తి యనదగును. ఇట్టి ప్రజ్ఞాసామర్థ్యమున ఆకాలపు కథలకే దేశకాల వైపరీత్యము లొదవని శాశ్వత స్వభావలక్షణము లాపాదించి నిరుపమానములును లోకమాన్యములును బహురసశోభితంబులును సద్ధర్మ నిరూపకంబులును నాటకకళా పరిణామ రత్నంబులును అగు రూపకరాజముల గల్పించి మానవ మానసంబున కలవిగాగు పరిణామ కళా సిద్ధిని పొందియున్నాడు.



# ఆంగ్లరూపకముల పరిపూర్ణవికాసము.

## విలియము షేక్స్పియరు (1564-1616)

ఇంగ్లాండులోని యావన్ నదీతీరముననున్న స్ట్రాట్ఫోర్డు గ్రామమున కొంచెము పరువుమర్యాదలుగల భూస్వామింట 1564 వ సంవత్సరము ఏప్రిలు 26 తారీఖున నీజగద్దైకరూపకకవి జననమొందెను. ఈతని జనని మేరీఆర్డెను అను సాధ్వీమణికూడ నొకమంచి పల్లెటి సేద్యకుటుంబము లోని పిల్లయే. విలియము చిన్ననాట తనయూరిలోని బడి పంతులువద్ద లాటినుపారసీతమందు చక్కని శిక్షగాంచెను. 14 వ యేట స్కూలువదలి 19 వ యేట ఆనీహాతవే యను నామెను తనకన్న నెనిమిదేండ్లు పెద్దదానిని పెండ్లాడి ఆమె వలన నలుగురుబిడ్డలను గాంచెను. 1586 లో షేక్స్పియరు

స్వగ్రామమునువిడచి, పోరుడిచ్చివద్ద బర్బేజి మహాశయుడు నిర్మించిన నాట్యశాలలో రంగప్రచారకుడుగ ప్రవేశించెను. త్వరలో నీతని యభినయకౌశల మెరుకపడినది. బర్బేజి నటమండలిలో చేరి తన జీవితాంతమువరకు నాతని నమ్ముకొనియుండెను. ఎలిజబెత్తురాణి ప్రాపక మనుభవించుచుండిన లీస్టరు, డర్బీ, హాన్సుడను, ప్రభువులు, యీనాటకసమాజము నాదరించి పోషించుచుండిరి. ఎలిజబెత్తు చనిపోయిన తరువాత 1603 లో జేమ్సురాజు షేక్సుపియరు నాటకసమాజమునకు ఆస్థాన సభాగౌరవ మొసంగెను. షేక్సుపియరు తనసమాజములో బర్బేజి వీరవిషాదపాత్రము లభినయించుచుండ, కెంపు అను హాస్యగాడు హాస్యరూపకములందు మేటియైవెలుగ నింగ్లాండులోని ప్రభుమందిరంబుల కరుగుచు నాట్యప్రదర్శన మొనర్చుచుండెను. ఆకాలములో షేక్సుపియరు జాన్సను రచించిన నాటకములందును తానురచించిన హాంలెట్టు మున్నగువానియందును, పాత్రధారియై యభినయించుచుండెను. ఇట్లు కొంతకాలము గడపి నాట్యవ్యవహారములలో పెట్టుబడి సంపాదించి బర్బేజితోగూడి లండను పట్టణమున గ్లోబునాట్యశాలను గట్టించి యాంగ్లరాజధానిలో నివాస మేర్పరచుకొనెను. మరికొన్ని నాట్యశాలలుకూడ లండనులో వీరు సంపాదించిరి. జీవితాంతమువరకు నటవృత్తి నాశ్రయించియుండినను యిందులో ప్రవేశించియుండిన నాల్గు సంవత్సరములకే నాటకరచన మారంభించెను. మొదటి కల్పనయందే యీతని కథావిస్తరణసామర్థ్యము పాత్రపోషకనైపుణ్యము గద్యపద్యముల నవలీలగ సకలరసభావవాహ

కంబుగ నుపయోగించు భాషాస్వాతంత్ర్యము, మానసవ్యా పార పరిజ్ఞానము, లోతుతలపులు, పాఠకలోకమునకు ప్రకటితమై, మొప్పవడసెను. 1591-1611 సంవత్సరములమధ్య నిరువదియేండ్లలో ముప్పదియేడు నాటకముల స్వతంత్రముగ రచించెను. ఫ్లెచ్చరు మున్నగువారి సహాయమున మరికొన్నిటినికూడ రచించెను. ఈతని బుద్ధివైశద్యము, కాలక్రమమున విస్ఫారి యింపొందినది. కాని తొల్లిటినుండియు మానవజీవితపు హాస్యవిషాద సందర్భములను సమదృష్టితో బారజూచి చిత్రించు నైపుణ్య మాత్మీయ మేధాభూతిచే వెలుగొందుచుండెను.

ఈతని మొదటినాటకములు హాస్యశృంగార రసాలంకృతములై యుండెను. వీనిలో నీతని విభావనశక్తియు లేతలువులు ప్రపంచజ్ఞానము మిక్కుటముగ నగుపడును. 1600 లో నీతడు రచించిన మూడు కామెడీలు (As You Like Twelfth Night; Much Ado.) యిప్పట్టున వీనికళా పరిణామమును తెల్పుచున్నవి.

Love's L... ur Is Lost 1591 సాంఘిక ప్రహసనము.

Two G ntlemen of Verona 1591 హాస్యశృంగారగాథ.

Comedy of Errors 1592 హాస్యప్రధానము.

Merchant of Venice 1594 కళ్యాణ విషాదసందర్భముల కలయిక.

Midsummer Night's Dream 1594 భావకవిత్వము, కథాగాంభీర్యము, లలితహాస్యముచేరినది.

All is well, that ends well 1596 కరుణారసమూలించు వలపుకథ.

Taming the Shrew 1596 హాస్యప్రధానము.

Troilus and Cressida 1603 స్త్రీచిత్తపు చాంచల్య స్వభావము గంభీరతతో వ్యంగ్యోపహాసములతో చిత్రించినది.

Measure for Measure 1604 స్త్రీపురుష సంబంధమందలి పాపకార్యములం విషాద ధ్వనులతో సూచించు కామెడీ.

Winter's, Tale (1510) Cymbeline 1611 ఇందు కామెడీ, ట్రాజెడీల ప్రత్యేకలక్షణములు కథాగౌరవమొప్ప ట్రాజీకామిడీగ, విషాదప్రహసనముగ మేళనమొందియున్నవి.

Tempest 1611 కావ్యసౌందర్యము, తత్వగాంభీర్యము వెలుగొందు కల్పితకథ.

ఈపట్టీవలన కామెడీ విరచనమందు షేక్స్పియరు మహాకవి మానసము బాల్యస్వభావముగు విపరీతాంశ విభావనము, హాస్యసందర్భ పర్యాలోచనము లందు మొలుదొల్త గ్రీడించి యివి ప్రధానముగనున్న భావగాథల రచించి క్రమముగ, మానవజీవితపు విషాద గభీరావస్థలను చింతించు లోతుచూపుల సంతరించుకొన్నట్లు విశదమగుచున్నది. అనగా వయసు ముదిరినకొలది షేక్స్పియరు మానవజీవితము కష్టభూయిష్టమని యనుభవించి తెలుసుకొని తదనురూపమగు భావముల తన సుఖాంతనాటకములందుకూడ ప్రకటించెను.

హాస్యశృంగారరస ప్రధానములగు కల్పితకథల కామెడీరూపకములుగ నొకచెంప రచియించుచు, మరియొకప్రక్క

నాంగ్లేయ దేశ చరిత్రాంశముల నాట్యరంగమున జూపువేడు కలో కొన్ని చరిత్రరూపకముల రచియింపదొడగెను. రాబర్టుగ్రీను, జార్జిపీలు, మార్లో ఈకవులు ముగ్గురు చేరి రచించిన ఆరవహెన్రీచరితమును ప్రదర్శనోపయుక్తముగ సంస్కరించి చరిత్రనాటకరచనయందు మార్లో తీసిన దారులనంటి 1593లో రిచ్చర్డు II అను స్వతంత్ర నాటకరూపకము రచించెను. తరువాత జానుభూజాని నాల్గవ హెన్రీ, ఐదవ హెన్రీ నాటకములలో, షేక్సుపియరు మహాకవి దేశచరిత్రమందు వెలుగొందు, మేటిమగల మనోవ్యాపారములను లోకులకందరాని లోతుచూపులు బరికించి, వాని స్వభావపోషణ మతిచిత్రముగ నేర్పరచి యాంగ్లవ్యవహర్తల స్వాతంత్ర్యాభిలాషను నిస్తుల దేశాభిమానమును తేటపరచెను.

1592 లో నీతడు రచించిన రోమియో జూలియెట్టుల విషాదప్రణయ కథాపరిణామము ప్రపంచములోని శృంగార విషాదనాటకము లన్నిటిలో మేలని చెప్పవచ్చును. ఇందీతని వయసు తెలివి నిండారు పట్టినట్లో వెలుగుచున్నది. కాని 1600 ల వరకు నీతనిమానసము విషాదావస్థల గభీర తత్వోపదేశక సామర్థ్యమును గాంచి రాజస మనోవృత్తులకు సాత్విక రసస్ఫూర్తి నొసంగెడి జ్ఞానోదయ మబ్బలేదు. కామెడీలు చరిత్రనాటకములు రచియించు నీభావానుభవములలో నీతడు చల్లగ జీవితరహస్యము పరిశీలించుచుండెను. మానవజీవితము, దుఃఖభూయిష్ఠమని గుర్తించి యాస్థితియెందున గలుగుచున్నదో? విమర్శించి చూచెను. భారతమందు చెప్పబడిన కాపురుషగుణంబులలో "క్రోధమునుబ్బును, గర్వము, పాపో

వనియనికియును, దురభిమానము, నిర్వ్యాపారత్వము” అను వానికితోడు అత్యాశ, అతినమ్మకము, మున్నగునవి కూడ మానవుని భంగపాటునకు కారణములగుచున్నవని గుర్తించెను. మన జయాపజయములు, సుఖదుఃఖములు మనచేతనే కలవనియు, (Man is the architect of his own fortune— There is a tide in the affairs of men which taken at proper time leads men to fortune) మున్నగు వాక్యములలో మనుష్యుని విజయసౌఖ్యములు వాని ప్రవర్తనవలన నేర్పడునని తెలిపియున్నాడు. మొత్తము మీద మానవకోటి సదాచారమార్గముల నరయజాలక పైచెప్పిన లోపములచేతను, అరిషడ్వర్గ ప్రభావమునను కార్యభ్రంశ మొంది దుఃఖసాగరమున దేలుచు, పరితపింతురని నిదర్శించుటకు తన మహానాటక నాయక పాత్రములను, కథాపరిణామమును, విషాద పూరితముగ జిత్రించి యున్నాడు. ఆ భంగము కార్యభ్రంశము, దుఃఖప్రాప్తి, విషాదజీవితము, లోకసామాన్యముగాన వీనిని నిర్దేశించు, ప్రధానపాత్రలను విషాదపూరితులగావించెను. కాని లోకమునందు పైజెప్పిన తప్పుదారుల పొందజేరక సదాచారులై నీతివర్తనులై ‘యెప్పటికయ్యది ప్రస్తుతమప్పటికి కారితి” నడచి నయముగ వాత్మ నిగ్రహముతో తనకు లభించిన కొద్దిమేలుకు సంతసించుచు చరించెడి యల్ప సంఖ్యాకులు, సుఖప్రదమగు శాంత సంతుష్టజీవనమున సుఖింతురని చెప్పుటకు తనవిషాద నాటకములలో ప్రధానపాత్ర నేడిపించు లోపములకు వ్యతిరేకముగ, మంచిగుణములుగల పాత్రములను, ప్రవేశపెట్టి వారి యారంభములు కథాపరిణామమున

సుఖప్రదముగ దేలునట్లు ప్రాసంగికముగ రచియించియున్నాడు.
యెట్టి మహనీయుడైనను బలవంతమగు లోపములు, కొన్ని
పట్టి, తప్పటడుగుల, జారనిచ్చెనేని నాశనమొందుననియు,
యెట్టి సామాన్యుడైనను ఆత్మనిగ్రహము, దూరాలోచన
సదాచారము, గలిగెనేని క్రొద్దిలో జయమొంది, తన జీవిత
కాలమును, సుఖముగ గడతేర్పగలడనియు షేక్సుపియరు
మహాకవి విరచితంబులగు విషాదనాటకములు బోధించుచున్నవి.
కింగులియరు నాటకములో కోపము, వుబ్బు హ్రస్వదృష్టి
వలన గలిగెడి భంగపాటు చిత్రింపబడినది. హాంమ్లెట్టులో
మనశ్చాంచల్యము, నిర్వ్యాపారత్వము. అతిఆలోచన వలన
గలిగెడి, విజయభ్రంశములు, పెద్దఆదర్శములు లౌకికపరిస్థితు
లలో వెతిరితలెత్తినను యు, దేలుచున్నది. అతేలో అనుభ
వించిన దుఃఖపరిణామము విపరీతమగు ప్రేమలు, నమ్మకములు,
సత్యశూన్యమగు నీపుడమిలో ననుభవించెడి పరాభవమును
చూపుచున్నది. మాక్బెత్తునందు ఆశాపిశాచము, విశ్వాస
శూన్యతలో భావాంకారములు, మానవున కేరర్పచగల, పరి
ణామనాశనమును, దెలుపుచున్నవి. జనులు పెద్దఆదర్శముల
వేడిమిచే గొన్ని సమయముల నొడిగట్టుకొను మహాపాత
కములు, కాలపరిణామమున పాపులొందెడి, శిక్షయు, జూలి
యస్‌సీజరు నాటకములో నిరూపింపబడినది. టిమాన్‌ఆఫ్
యాతెన్సునందు "అర్థం నాస్తిగృహంనాస్తి । నాస్తిబంధు
నహోదరాః—తస్మాత్ జాగ్రిత, జాగ్రిత," అను దర్మ
ముపదేశింపబడినది. విషయలోలురై యల్పసుఖము
నపేక్షించి, మంచి యవకాశముల జారవిడచి నీచావస్థల జిక్కి

దుఃఖించు బుద్ధిహీనుల యుదంతము, కాంతాసల్లాపపారవశ్యమున, మైమరచి రోమకసామ్రాజ్య సమాలంబన మహావకాశమును జారవిడిచిన యాంటోనీ చరిత్రమందు చిత్రింపబడినది.

## VII

### స్పైను దేశపు రూపకావిర్భావము.

ఇంతలో స్పైనుసామ్రాజ్య మేలుచుండిన చతుర్థపంచమ ఫిలిప్పుల శేషవిభవోపేతులై లలితకళా పోషణ మొనర్చుచుండిరి. వీరియాదరణలో పెంపొందిన,

### లో పే, డ వే గా 1562-1635

మతచారిత్రకథాత్మకములగు సుమారు 1800 కామెడీలను, 400 క్రైస్తవకథారూపకములను సృజించి, స్పైనుదేశమున నవీననాటక లక్షణము లేర్పరచెను. ఈతని రూపక కావ్యకృతు లకృత్రిమపదలాలిత్య మొప్పుచున్నవి పద్యపఙ్క్తులు దృశ్యకావ్యముల కెంతయు నొప్పిదముగ నొసగియున్నవి. కథాసందర్భములు, నాటకపాత్రములు, స్వభావసదృశముగ, యథారూపముగ చిత్రింపబడినది. సంవిధానము గుంభనగ మంచిమట్టుదిట్టములతో కూర్పబడియున్నది. మూడు అంకములు గల కామెడీల నీతడు మునుమొదల నారంభించి రచించెను. ఈతని, యుదాత్తనామాఖ్య కావ్యకళానైపుణ్య మెల్లసీమల గౌరవింపబడినది. ఇతనితరువాతవచ్చిన

### కా ల్డె రా న్ 1600-1681

నూటపదునెనిమిది నాటకములను 72 ఆటోలను రచించెను. ఆటోలనగా క్రైస్తవాలయములందు ప్రదర్శింపబడు

మతవిషయిక రూపకములు, ప్రబోధచంద్రోదయము వంటి సాంకేతిక నాటకములు. వీని నందముగా గల్పించు నేర్పులో కాల్డెరానద్వితీయుడు. కాని కేవలనాటకముం దీతడు లోపేరు తీసిపోవుచుండెను. వీని పాత్రపోషణవైచిత్ర్యము కొరవడి నను, పద్యగమకము భావసమృద్ధిలో పేరూపకములను మించి యుండెను. మరియు, ప్రదర్శనోచితమగు కథాసందర్భముల గల్పించుటయం దీతడు అమేయకౌశలమె చూపుచుండెను. ధారాసారళ్యము కూడ ప్రశంసింపదగియున్నది. వీని నాటకములు (The fairy lady, The Mock astrologer, Life is a dream) మున్నగునవి పేరొందిన యిప్పటికిని రూపకకళా సౌందర్యనిదర్శనములై వెన్నొరయుచున్నవి

ఈస్పెయిను రూపకకవుల కల్పనలు శేషశేముషీవిరాజితములై నవంతమగు జీవితావస్థల నిరూపించుచు నర్థగాంభీర్యముతో సద్భావతరంగిణీసంచలన దీపితప్రదనకాంతి మాలికలతో జీవితవ్యత్యస్త జ్యోతిస్తారల మేటిదంబున మిడిసి మెరుగారుచున్నవి. వీరి గీతులు యూరోపులో నలుదెసల జనరంజకములై భావరూపరచన కెంతయు దోడ్పడినవి. వీరి ప్రబోధనాటకములో నిరచనోత్సాహముల పరాక్రమించిన మొదటి విఖ్యాతరూపకకవి.

## VIII

### ఫ్రెంచినాటక విజృంభణ.

### పాయిర్ కార్నెల్లీ 1606-.684.

అబ్రహాసుదేశీయుడు. ఇతడు లాకిస్ అను మహానాటకమును రచించి ఫ్రెంచినాటక కవిత్వమునకు మూలపురుషు

డాయెను. ఇంతలో యింగ్లాండులోని రూపకరూపములు కొన్ని మార్పులతో నానాలంకార విలసితమగు నీచప్రహసనంబులై రెస్టరేషను కాలపు యధోగతిజెంది నడచుచుండెను. ఎలిజబెత్తు గతించినతరువాత నాంగ్లదేశమున నీతిసంస్కరణోద్యమమొకటి వెలసి నాట్యాది లలితకళల కెన్నియో నిర్బంధముల గల్పించుచుండెను. ఫ్రెంచిదేశము పదునాల్గవ లూయీ ప్రభుత్వమున దిగంతవిస్తరిత సామ్రాజ్య సంపద్వైభవంబుల దులదూగుచుండెను. వీని యాస్థానము సరసకళానిలయమై నాట్యకుమారి నరించివచ్చిన నృత్తరంగమై జెన్నొందుచుండెను. లూయీ భూజానివలన నిత్యమర్యాద లందుకొనుచుండిన కార్నెల్లీ మహాకవి [illegible]కేసు లామెంటూను సిగ్నా మున్నగు విషాదనాటకములను కొన్ని హాస్యరూపకములను రచించి రసికులో మహామ్రతి సమాజించు రాజకీయతంత్రములకు రూపకనిదర్శనమేర్పరచుచుండెను. కార్నెల్లీ ప్రాచీనరూపకలక్షణము లవలంబించి ఫ్రెంచిదేశపు తొల్లిటి మహానాటకకర్తుల గల్పించెను. మానవసంకల్పము బాహ్యపరిస్థితుల మార్పులకన్న మిన్నయై విజయవిభూషితమై నలరారు పట్టు లీతని యభిమాన ప్రధానాంశములై యుండెను. కామాదిరాగద్వేషముల ద్రుంచి నీతిపద్ధతులవలంబించి విధికృత్యమెరింగి నయముగ జీవించు ధీరపాత్రలీతని యుల్లముల యించుచుండిరి. ఈతని నాయకులు ధీరోధాత్తలలిత సద్గుణారాసులగు కతన నీతని కల్పనమంతయు నుదారభావభూషితమై ఆర్జవంతమై సాత్త్వికరసశోభితమై మహాకావ్యంబుల మెలిమెరపుల జిలికించుచున్నది. వీనికవసరముచూ ను దృశ్య

లోపము లగుపడుచున్నవి. భావగాంభీర్య మొదవింపుసంకల్పమున భాషాప్రయోగ ముపన్యాసఫణితిలో దృశ్యకావ్యము లందుపయోగింపని డవులుధాటీలతో మిన్నుమన్నుల జెలరేపదుముకు చుండును. కాని ధీరమానసము లనుభవించు మనోవేదనము, విరోధిసంకల్పముల భీకరసంఘటనము నిరూపించు నాట్యావస్థల నూహించుటలో, యిట్టి భావసంక్షోభమున దెప్పరిల్లెడి యుదారపాత్రముల సంభాషణమమర్చుటలో కార్నెల్లీని మించిన రూపకకర్త లీజగంబున గానరారు.

### మాల్యేరు ( 1622-1673 )

ఫ్రెంచి దేశమున సవిశేషముగ కామెడీ (కళ్యాణాంత నాటకము) ని సృజించిన మహాకవి. ఇరువదియేండ్ల ప్రాయములో ప్యారిసునగరమందొక నాటకసమాజమును గూర్చి రాజధానిలో వీసియాటలు ప్రజామోద మొందనికతన పరాసుదేశపు మండలపత్తనములందు సంచరించుచు హాస్యశృంగారాభినయములందు మేటినటుడను కీర్తి సంపాదించుకొనెను. గ్యారిక్కు అభినయించునపుడు యెట్టిభావసూచక ముఖాంగసంచలన మేర్పడి జీవితావస్థలు కన్నుల గట్టినట్లు అగుపడెనో అట్టియథారూప స్వభావాభినయకీర్తులు మాల్యేరునకు పట్టువడియెను. నాటకసమాజముల గూర్చి నయముగ నడపించుటలో నితెడారితేరెను. మండలసంచారమందిట్టి విఖ్యాతి గణించి 65- లో ప్యారిసులోని యాస్థాననాట్య భవనాధిపోద్యోగమున నియమింపబడెను. 1659 లో The precious ridicule అను సాంఘిక ప్రహసనము 16 2 లో La Ecole-des Femmis అను, సుప్రసిద్ధ కామెడీ రూపకము నురచించెను.

వారిలోపలేశములను కొండంత చేసి యసహ్యవికార రూపములఙ్కించి యవమానించు నీచప్రహసనరీతు లీతని యందగుపడవు. లోకవ్యవహార సంస్కరణ సంకల్పములే, మంచి చెడ్డ లన్నివ్యక్తులందు కలసియుండుటను సమదృష్టియే, మాల్యేరు మహాకవి మానసరంగమున రాజిల్లుచుండెను. వీని నాటకముల కథాకల్పనము, పాత్రపోషణము, శాశ్వతమానవ ప్రవృత్తుల సూచించు, విశ్వవ్యాప్తిగలిగి, చదువరుల దేశ కాలానుభవముల కనుకూలమగు రీతుల నర్థమగు చుండును. మానవజీవితములోని యవస్థావిశేషములు జూపనెంచెనుగాని, పసివడి దిద్ది, మెరుగెట్టి, కావ్యరచనాచాతుర్యమున మెప్పించ యత్నింపడు. అభినయోచితమగు రసభావముల నుపయోగించ జేసి, నాట్యరంగమున రక్తిగట్టెడి కథాసందర్భముల నూహించి, జీవసంచలనోద్వేగసౌందర్య మేపార రచించు సామర్థ్య మీతని యొకిలోని సొంత సొమ్మని నుడువగవచ్చు. (Mis Anthrope) అను రూపకరాజమందు కథా సందర్భములు సాధువడి, బాహ్యవ్యవహార సంచలనమున కవకాశములు లేకున్నను, భావవికాసముతోనెంత మనోహరముగ విప్పారును ప్రేక్షకుల నుదివరకు తమ పీటలకతికించు రసపాటవ మొప్పియున్నది. వీనిశైలి సామాన్యముగ సర్వావస్థానుకూలముగ నుండునుకాని, పసిగొని దిద్దుకతన గొన్నితావుల నిస్సారస్యదోష కలుపితంబగుచున్నది. అతిమానవిమర్శకు లీనా టకోపములనకు జంకిల్లుమెంపగు కాని. భాషాపరిమితముగ నెల్ల వేళల సందర్భోచితముగను, జీవతోషితముగను, భావవాహక వైశద్యమునను, రూపక కావ్యోపయోగముగ నవగించి

నిండారుచుండును. మాల్యేరు రచనలందలి వాక్యగమకము దృశ్యకావ్యముల కెంతదగియున్నదన, దానిని జదువువారలు నిస్సంకల్పముగ నాట్యవైఖరిదాల్చి యభినయ మార్గముల నూని వచింపగలరేగాని, మరియేవిధమున నుచ్చరింపజాలరు. అనగా ఈతని పలుకుకూర్పులందు నాట్యతత్వము సహజప్రాభవ మొందియున్నది.

## రాసీను (1639-1700)

చక్కని సంస్కారి. లూయీసభాస్థలి నలంకరించు మేటిసత్కవులలో నొకడు. బోయిలో, లాఫాంటేన్, మాల్యేరు మున్నగు ధీనిధులనెయ్యంబందికొనిన వాడు. The bride, Andromache, Iphigene, మున్నగు ట్రాజెడీలను ఒక కాలండీని రచించెను. ఈతని చివరరచనలు భక్తిభరితములై యున్నవి. రాసీనుమహాకవి ప్రాచీన యవనరోమక కావ్యాలంకారలక్షణంబుల దిలకించి, వాని యాదేశప్రమాణముగ నిర్దుష్టమని మెచ్చదగు నాటకకవిత్వ మల్లుచుండెను. కావ్యలక్షణము లీతనియందు మూర్తీభవించెను. లక్షణ నిబంధనము లీతని మనోరీతుల కనుకూలములుగ నుండినవేకాని ప్రతిబంధకములు కాలేదు. శక్తిగొని, నాటకకవిత్వమున అంతరించెడిపట్ల వరించి నేర్పుమైనెక్కి, చిత్రించి, మెరుగిడి రచనాచాతుర్య మొప్పించుచుండెను. కావ్యసౌందర్యము నందును, రూపక కథాకల్పనమందును కార్నెల్లీ మహాకవి రాసీనుకు కందరాకుండెను. కార్నెల్లీ నడతలలో హెచ్చుతగ్గులు వక్రగమనము గోచరించును. రాసీనురచనలు కాళిదాసు కవిత్వమువలె, శ్రీనాథుని కావ్యపాటవమున నొక్కరీతిగ

నడచుచుండును. రాసీను కథావస్థలను, రససందర్భముల నుత్పత్తిజేయు సాధనములుగ నుపయోగించెనేకాని, వానిని ప్రత్యేక సాంఘికనైతికాది వ్యవస్థల దెలుపు నుద్దేశముతో వాడలేదు. వస్తువునకు భావసూచక ప్రయోజనమే ఆపాదించెగని స్వకీయ కావ్యోచిత సౌందర్యమూహించి యుండలేదు. వీని నాటకములందు మానసవ్యాపార వైఖరుల సూక్ష్మవిమర్శనమే ముఖ్యాంశముగ నగుపడును. రసభావముల సూక్ష్మవిభజన మొనర్చి సకలవిధములగు విభావానుభావ సంచారీభావములను రసావస్థలను నిరూపించు లక్ష్యములుగ రూపకకథాంశము లేర్పరచినందున, సీతని నాటకము లనంత రూప విశేషముల జెన్నొందుచున్నవి. వీని పద్యరచన మద్వితీయ పదలాలిత్య మొప్పారుచున్నది

లూయీచక్రవర్తి నిరంకుశాధికార విరాజితమగు సామ్రాజ్య శాసన మొనర్చుచుండెను. ల్యూతరు ఎలిజబెత్తుల కాలములలో రోమకమతాచారములయెడ గలిగిన తిరుగుబాటు, యీకాలమున కొంకింత చల్లారి, క్రమ్మరి యూరపులో ప్రాచీన రోమకమతసాంప్రదాయముల ప్రాభవ మెచ్చుచుండెను. ప్రజలకు ప్రాచీనవిద్యలందును, మతమందును, గౌరవమేర్పడి, మతసాంఘిక రాజకీయ విషయములలో పిన్నపెద్దలనెడి పరిజ్ఞానముదయించెను. ఇట్టి సంఘస్థితిలో రూపక కల్పన మొనర్చుచుండిన కార్నెల్లి రాసీనులు, యవనరోమక కావ్యలక్షణముల సరాధ్వకార మంగీకరించి; ప్రాచీన కావ్యాదర్శముల ననుసరించి ఫ్రెంచిరూపకరాజముల గల్పింపనేర్పరైరి. వీరిపాత్రలు ధీరోదార లలితగుణాలంకృతులు. వీరి

వృత్తావిన్యాసము లక్షణమర్యాద ననుసరించియున్నవి. దేశ కాల నియమములు వీరిరూపకములం దాదరింప బడినవి. మరణాద్యవస్థల నాట్యరంగమున ప్రదర్శింపక నేపథ్యమున జనాంతికముగ జరిగినట్లు విష్కంభ ప్రస్తావనలందు తెలుపుచుండిరి. యీయాచక్రవర్తి యాస్థానకవీశులు లలితకళల మంచి చెడ్డలెరింగి కావ్యప్రాశస్త్యమును నిర్ణయించుచుండిరి. అందుచే యీకాలపు ఫ్రెంచిరూపకములు లలితసంస్కృతమర్యాద ననుసరించి రూపునందును పోకడలందును పొందికయందును శిల్పమందును నిరుపమానములుగ శోభిల్లుచుండెను. ఇట్టి చిత్ర కవిత్వపద్ధతులు రాసీను, కార్నెయిలుల చేతిలో పరిణతరూపముల దాల్చినవి. వీనితో బోల్చి చూచినయెడల షేక్సుపియరు, మార్లోయరుమహాకవుల రూపకములు వట్టి గొల్లభాగవతములుగ నగుపడకమానవు. వీరిరువురు సహజపాండిత్యమేపారు నిసర్గ కవీశులు. మాలియరు స్వకీయబుద్ధిప్రభావమున, నదివరకు యూరపులో జనామోదమొందుచుండిన ఆటిల్లాప్రహసనములు ప్లాటసు, టెరెన్సు మున్నగువారి ప్రహసనరీతులు జనసామాన్యమును రంజింపజేయు నానావిధములగు రూపకరూపములు వీనన్నిటి తనయందు జీర్ణించుకొని నవ్యకాలోచితమగు హాస్యరూపకములను కామిడీలను రచియించు కావ్యస్వతంత్రుడాయెను. ఈతనిపాత్రలు ధర్మసంకేతములుగాక ప్రత్యేకవ్యక్తి లక్షణములతో నాట్యరంగమున తమప్రత్యేకవ్యక్తిజీవనము నలవరచుకొనుచుండును. కవిచాతుర్యమున నీపాత్రలన్నియు సను పమజీవకాంతుల దేజరిల్లుచుండును.

### కాలసంధి

చరిత్రాంక ప్రకరణమందు విస్తరించిన రీతి నాంగ్ల దేశమందీకాలమున ఫ్రాన్సు కళాదర్శములు సభాగౌరవ మొంది విజ్ఞులచే నాదరింప బడుచుండెను. మాల్యేరు మహాకవి స్వయముగ ఇంగ్లాండునకు బోయి నాట్యరంగముల సంస్కరించి వచ్చెనని చెప్పియున్నాము. వీనిలక్ష్యమున ఇంగ్లాండులో రెస్టరేషను కామెడీ యనబడు రూపక రీతులేర్పడెను. ఇందు జీవ చైతన్య మేమియును గోచరించదు. నాట్యరంగము తొల్లిటి మంటపపు పద్ధతిమాని క్రమముగ చిత్రరూపమును దాల్చుచుండెను.

### జాన్ డ్రైడెను. 1631-1700

ఆనాటి ప్రజారుచుల కనుకూలముగ డబ్బు కొరకు 22 నాటకములను రచించిన విద్వత్కవి ఈతని కావ్యధోరణి వేదాంత దేశికుల భట్టుమూర్తి శతక కవులు మున్నగువారిని స్మరింప జేయుచుండెను. అచ్చటచ్చట కొన్ని చక్కని పద్యావళులు మెరయు చున్నను రూపక కల్పనమందీతని కెట్టి చాతుర్యము కలుగకుండెను. మరియు నాకాలపు దైనిక జీవితములో ఫ్రాన్సు రాజ సభామర్యాదల ననుసరించి సంక్రమించిన దుర్విషయ లాలనము డ్రైడెను రూపకములందు బట్టబయలుగ విరబోసియున్నది. ఎలిజబెత్తు రూపక కవుల పోకడలుకొన్ని డ్రైడెను నందు జూడనగును. కాని ఆ కాలములో యూరపు నందెల్లెడల నల్లికొనిన ప్రాచీన కావ్య లక్షణములే ప్రాధాన్య మొందియున్నవి. డ్రైడెను నాటకములకన్న నతని విమర్శనలు ప్రస్తావనలు పాండితీగరి

మును విమర్శక సామర్థ్యమును వెల్లడించుచున్నవి. కొంచె మించు మించుగ నీ పద్ధతులను అవలంబించి రచించిన ఆంగ్ల రూపక కర్తలలో ఆట్వే (1651-85) వాన్‌బర్గు (1664-1726) కాన్‌గ్రీవు (1670-1729) రో (1674-1718) మున్నగు కర్తలు పేరొందియున్నారు. వీరి రచనలతో పదునేడవ శతాబ్దమున బ్రిజలు చిరస్థాపిత మత సాంఘిక రాజకీయ సంస్థాపన లందును ప్రాచీన సారస్వత రూపములందును పోరు డవులు లందును కులాసా బ్రతుకులందును విశ్వసించి చరించిన కాలములో యూరపునందు ప్రజా వినోదము కొర కేర్పడిన హాస్య శృంగార రూపకములు నిండురూపములు దాల్చి పరిణత మహోన్నతి జెంది క్రింది మొగమున దిగ జార మొదలిడినవి.

18 వ శతాబ్దములో యూరపునందు జరుగుచుండిన యధికారణమ్ము విమర్శక సంశోధనము చరిత్రాంశములలో జూచియున్నాము. ఆకాలమున సామాన్యవిషయములు శాస్త్ర సామగ్రిగ సంగీకరింపబడు నవ్యమర్యాద లేర్పడెను మత సాంఘిక రాజకీయ కళాసాదర్శములందును శాస్త్రవిచారణ మందును శబ్దపరిశోధనమందును ప్రాచీననిబంధనల నేవగించి వెలిలించి పారద్రోసి యాత్మానుభవమే ప్రమాణముగ నెంచి యన్ని విషయములలో స్వతంత్రసంచార మొనర్చెడి యధికారి తిరస్కారము ఆత్మగౌరము సమబుద్ధి విప్పుచూపు యూరపు లోని జనులందర కేర్పడుచుండెను. 18 వ శతాబ్దమున నింగ్లాండులో పెక్కునటశేఖరు లుద్భవించి ఎలిజబెత్తునాటిరూపక రాజముల నభినయించి రసవ్యాఖ్యాన మమర్చి యానాటి ధీర

సంచారమును మరల నిలుపసాగెను. ఎలిజబెత్తు కాలములో నాంగ్లేయులు యూరపుచక్రవర్తులయొక్క మతాచార్యుల యొక్కయు నధికారమును అనవెట్టి యాంగ్ల సామ్రాజ్యబీజ ములనాటి కొంత విజయమొందిరి. 18 వ శతాబ్దములో ఈ బీజములు మొలకెత్తి విశ్వవ్యాప్తమగు నాంగ్లసామ్రా జ్య విస్తరణ మహాఫలము లేర్పడుచుండెను.

18 వ శతాబ్దమున ఫ్రెంచి ఇటలీదేశపు కవులచే కల్పింపబడిన పద్యగద్య నృత్తగీతమయంబగు హాస్యశృంగార నాటకములు కొంతకాలము పరిజారంజకములై విరివిగ నాడ బడుచుండెను. వీని పోకడలు యొద్దికలు పూర్వపుగభీరమహా నాటకములకన్న యెంతనడస శోభితంబులై వినజూడ నింపు దగిలి యుందగించుచుండెను. నాటకకళావిజయమునకు నా టకకవియేగాక నటప్రతిభకూడ తోడగునని ప్రజ లెరింగెడి. మర్యాద గ్యారిక్ మహానటుని ప్రతిభాప్రభావమున నేర్పడెను. 1743 లో మాఫీయను ఇటాలియను నాటకకవి (Mirope) అను నాటకమణిని గల్పించెను. దీనిలక్ష్యమున 1757 లో ఇంగ్లాండునందు హోమానుఅనువాడు డగ్లసురూపకమును రచించెను.

—♦ ఆలివరు గోల్డుస్మిత్తు 1728-74 ♦—

ఐర్లెండులో జనియించి ఎడింబరో మున్నగు విద్యాని కేతనములందు చదవ చదవక పిల్లనగ్రోవి బూరించుచు యూరపులోని సమస్త దేశములు చూచివచ్చి నిరవనుభావ సౌకర్యమొప్పెడి లలితకావ్యములను చదివి వ్యాసములను చరిత్రలను రచించి లండను నగరమందలి పరిష్కారకులలో

మొకడుగ బఘరివిల్లి She stoops to conquerఅను సాంసారిక కథాత్మమగు రూపకమొకటి రచియించెను. ఈ రూపక మిప్పటివరకు సర్వజనానంద దాయకమై యనువత్సరము సీమలో నాడబడుచున్నది. పాత్రపోషణమం దీతడద్వితీయ చమత్కారమును చూపియున్నాడు. దయా స్వాంతుడు విశాలసాధుస్వభావుడు. ఈతనిరచనలందు అనిర్వచనీయ మగు కరుణారస మలరుచున్నది.

X

## 18 వ శతాబ్దమున యూరపులోని రూపకరచనము.

### ——◆ల్యూడ్విగ్ హాల్బర్గ్ (1684-1754)◆——

ఈ కవి డెన్మార్కుదేశపు నాట్యకపితామహుడు. విశేషముగ దేశాటనమొనర్చి నిశ్శేషముగ మానవవిజ్ఞాన మంతయు కొల్లవెట్టి తన దేశభాషలో పెక్కు గ్రంథముల రచియించి నవీన డేనిషు సారస్వత విన్యాసమునకు పునాదులేర్పరిచెను.

1722-27 కోపెను హాగెన్ నగరమందు క్రొత్తగ నిర్మింపబడిన నాట్యశాలకు సూత్రధారుడై యనేక కామెడీలను రచించెను.

ఫ్రెంచిదేశమున మరివా 1678-1763 అను కవియు బొమార్కెయసు అనునాతడు 1732-99 మామూలుసంసారములోని సంధర్భము లను రూపకములందు ప్రవేశపెట్టి యథారూపముగ చిత్రించుచుండిరి. బొమార్కెయసు పదిహేనవ లూయిచక్రవర్తి పోషణలోనుండెను. కథాకల్పన యందు విశేష వైదుష్యమొప్పుచుండెను. నవీనమందారి తీసినవాడు.

స్పెయినులో గొంతకాలము తిరిగివచ్చి యూజెనీయను ట్రాజెడీనొకదాని రచించెను. ఇది గీటీమహాకవి రూపకములలో నొకదాని మాతృకమై వాసిగనినది. The Barber of Seville, The Marriage of Figaro అను నాటకములు మొజరాట్, రోజినీమున్నగు మహాగాయకు లభినయింప లోకవిఖ్యాతములయినవి.

అప్పటివరకు ఇటలీలో సర్వసాధారణముగ బ్రదర్శింపబడుచుండిన ఆటెల్లాప్రహసనము కాలవశమునసీరసమై ప్రజామోదమునొందకుండెను. ఇందుచేత క్రొత్తరూపకముల రచియింపు వేడ్కతో

—♦ కార్లోగాల్డోని 1707-93 ♦—

అను ఇటాలియను కవిశేఖరుడు మోల్యేరుపద్ధతులననుసరించి సత్వరరచనా ప్రతిభావమున ననేకరూపకములరచియించెను. లోపే స్పెయిను నాటకములకెట్టి మహోన్నత నవ్యవిలాస మొసగూర్చెనో అట్టిసాయమే గోల్డోని ఇటలీనాటకమున కొనర్చెను. ఈతని భాష సొంపికగలిగి సుందరముగ నలుకుచుండును. కథాకల్పనమందీతడు అసాధ్యప్రతిభాసమన్వితుడు. హాస్యోల్లేఖనమునందు రమ్యావస్థాకూర్పందును. గాని వీనినాటకములలో నీతికొరవడుచున్నది. వీనితరువాత సంపన్నప్రభువంశమున జనించిన

—♦ విట్టోరి యాల్ఫెరి 1749-1803 ♦—

యిరువదియొక ట్రాజెడీలను, ఆరు కామెడీలను, ఒక ఆపెరానురచియించి భాషాప్రయోగస్వాతంత్ర్యమూని ఇటాలియను నాటకములందు భావోద్రేకముదయింపజేసెను.

—♦ షెరిడను 1751–1816.♦ —

ఆంగ్ల నాటకకవి. ఒకనటునితనయుఁడై రాజకీయ మ హోపన్యాసములందు వెలిఁగెడి సాధన మవలంబించెను. 1775లో The rivals అనునాటకమునురచించిడూరీలేనునాట్య శాలలోభాగస్వామియై 77లోSchool for scandal అను ప్రసి ద్ధహాస్య రూపకమునుసృజించియాడించెను. ఇదిరెండుభాగ ములుగ నేర్పడిన పంచమాంకనాటకము. ఆంగ్ల సాంఘిక జీవనము లలితహాస్యరీతులలోదెలిపెడి మేటిప్రహసనమని యి ప్పటికిని గారవింపబడుచున్నది. ఇందలిస్వభావములు సూక్ష్మ విభేదములన నెంతయు విచిత్రముగ గూర్పబడినవి. Rivals అను నది గూడ అయి దంకముల హాస్యనాటకమే. ఇదియు గోల్డుస్మిత్తురచియించిన She Stoops to conquer అనునది యు భావప్రపూరితములగు 18వ శతాబ్దపు కామెడీలపరిణత సు స్వరూపమును దిలకించుచున్నవి.

యూరపులోని యితరదేశములందు నాటకములు నట కౌశలమవలోకించు నుద్దేశముతో ఆడబడుచుండెను. ఫ్రాం సుదేశమందు వాల్టేరుమహాకవి (1694–1778) Oedipe మున్నగు రూపకరత్నములలో నధికారుల దిరస్కరించుచు నె ను. వీని సమకాలిక మహావిద్వాంసుడగు డిడరాటు 1713–84 హాస్యాభాసము అను విమర్శక గ్రంథమును రచించి నటుల ధర్మములను విమర్శించి సామాన్యసాంసారికసందర్భముల నాత్మరూపకములందు వెలిగింపజేసెడి పద్ధతుల నిర్వచించెను.

## XI

### —♦ జర్మనీలోని భావరూపక మహోదయము. ♦—

ఫ్రెడరిక్కు మహా చక్రవర్తి జర్మను దేశమును కట్టుబాటులో సంపద్బలోపేతముగ నొనర్చి చిరకాలమునుండి దీరకుండిన వంతలదీర్చి యాజాతికి నవ్య వికాసమేర్పరచెను. 19 వ శతాబ్దములో దొల్లిటి సగమందు జర్మనీ కావ్య వేదాంత విద్యలందు భూలోకమున మేటియై వెలుగొందు ప్రతిభావిర్భావ యుషఃకాంతులు 18 వ శతాబ్దాంతముననే గోచరించుచుండెను.

### —♦ లెస్సింగు మహాకవి 1729-81. ♦—

ఈతను యవన సాహిత్యమును జక్కగ నభ్యసించి షేక్స్పియరు రూపకములందభిమాన పాండిత్యమొంది కళా స్వరూపమును రసతత్త్వమును జక్కగ చింతించి కొంత కాలము హాంబర్గునగరములోని నాట్యశాల కధిపతియై హాంబర్గు డ్రామటర్జీను విమర్శక గ్రంధమును రచియించి రాసీను, కార్నెల్లీ, వోల్టేరు మున్నగు కవులవలంబించిన ప్రాచీనకాల మాషిత నిరుపయోగ లక్షణ నిర్బంధములనూడ్చి నాట్యకళ, నుద్ధరించి రక్షించెను. స్వతంత్ర జాతీయ పద్ధతుల మీద నాట్యాది సారస్వత మేర్పడ వలయుననియు ఎ[illegible]రుచించి నిర్జీవకల్పములై విగత మర్యాదలగు ప్రాచీన కావ్య స్వరూపములీనాటి కావ్యాదర్శములు గానేరవనియు బోధించి జర్మనీ దేశమందు గేటే మహాకవి యవతరించుటకును ఆంగ్లదేశమున వర్డ్సువర్తు మున్నగు నవీన భావ కవులేర్పడుటకును వలయు పరిస్థితుల గల్పించి దారితీసెను. ఈమహాకవి మర్మజ్ఞుడు రసప్ర

మానసవ్యాపారముల విమర్శించి దెలిపెను. మెస్సీనా అనురూపకము యవన నాగరిక కాలపు జీవితమును చక్కని కుమార కావ్యరీతులలో దెల్పుచున్నది. ఇవికాక William Tell మున్నగు గల రూపకరాజము లనేకముల వ్రాసియున్నాడు.

## యోహాన్ గెటే 1749-1832

రవీంద్రనాథటాకూరు, గాంధీమహాత్ముడు, అరవింద ఘోషు, ఈముగ్గురి తెలివితేటలను జీవితపద్ధతులను ఆత్మతత్వములను ఒక్కపురుషునియందు చేర్చి వీరికెవ్వరి కందరాని యనూహ్యప్రభావ ప్రదీప్తుల దేజరిల్లు మహాపురుషుని భావింపగలమేని డాంటే కాళిదాసుల కావ్యశక్తు లచ్చట లూహింపగలమేని ఆమూర్తియే గెటే మహాకవి యనిపించదగును. వీనిజీవితము పవిత్రోదార సదాచారముల దృశ్యరూపముగ నాదర్శప్రాయమై సుమితుల్యముగ నుండెను. శమదమాది నియమములేగాక రవీంద్రుని జీవితమం దగుపడు నిర్వ్యాజసుఖార్తియు కావ్యసౌందర్యము వీనియం దగుపడుచుండెను. జర్మనుల జాతీయకావ్యరీతి స్వకీయ భావానుభవముల జిత్రించు భావకవనమై యున్నది. అట్టిభావ వికాసవంతమగు జర్మను సారస్వతములో గెటె రచించిన కావ్యములు ప్రత్యేకభావగీతములుగ నెంచబడుచున్నవి. ఈతను సర్వజ్ఞుడు, సమస్త విషయములందు జర్మనీలోని నవీనభావముల కుదురు ఈతని రచనలందు స్వకీయ జీవితానుభవములు లేతకాంతు లీనెడి పరతత్వచింతతో వెలుగొందుచున్నవి. అంతకుపూర్వము పరాసు ధీనిధుల సారస్వత ప్రభావమున నాటకలోకముండెను.

తంబునకు నవ్యపథముల దొరికలేదు. కాని మానవ జీవితము సమయముగ సుఖప్రదముగ పవిత్రముగ నుపయోగకరముగ నడుపింప నేర్పెడి జీవిత సమస్యల కీతని గ్రంథములు శాశ్వతోపకారకములగు సమాధానము లొసంగుచున్నవి. భావకవిత్వమునకు ప్రధాన గౌరవమొసంగియు పరిష్కృత సమస్యలను జర్చించియు తరువాతి పరాసుదేశపు కావ్యరీతులను శాసించు మార్గదర్శియై గెటీ గతించెను.

అప్పటికి యూరపులో నెపోలియను చక్రవర్తి యుల్కా ప్రకాశమున నతిశీఘ్రముగ నొక్క వెలుగున బంధ విల్లి పరాజయమొంది ప్రవాస శిక్షననుభవింప జనెను. యూరపులోని సమస్త దేశములందు జాతీయ భావములుదయించి స్వీయ సాహిత్యరూపములను ప్రకాశింప జేయు కాలమరుదెంచినది. ప్రకృతిశాస్త్ర సహాయమున పరిశ్రమలు విస్తరించి నవ్యజీవన సమస్యలందించుచుండెను. ఫ్రెంచి దేశమున సామాన్యజీవితకథలను భావగాంభీర్యముతో నాత్మానుభవప్రకాశముతో కావ్యవిషయములుగ నొనరించి యభినవభావ కవితారీతులు నాటకములందును నవలలందును ఉపయోగించెడి పద్ధతులేర్పడుచుండెను. కళావిమర్శకులు ఇదివరకువలె కొన్ని ప్రాచీనసూత్రముల గైకొని వానిప్రమాణమున కావ్యముల ఖండించి శిక్షించుచుండుటమాని కవిహృదయమును తెలిసికొని కావ్యమందలి ప్రత్యేకలక్షణము లామోదించి కళోపాసకులకు సర్వస్వాతంత్ర్యమొసంగి లక్షణానుసరణాధికారమును దుంచి కావ్యమునకు స్వాతంత్ర్యమహిమాప్రభావముల జూపుచు రసవ్యాఖ్యానమొనర్చుచుండిరి. ఫ్రెంచిదేశపు

నవీనభావకవితారీతులకు వలయు ప్రేరణను యుత్సాహము షేక్స్పియరు మహాకవి యాదర్శనమున నేర్పడినవి.

జర్మనీలో వీలాండుఅనుకవి(1733-1813) షేక్స్పియరు నాటకముల జర్మనుభాషలోనికి సంతరించెను. డెన్మార్కులో అన్ స్లీగరు(1779-1850) అనుకవిగెటీడారుల నవలంబించి పురుషపాటవమొప్పు రూపకరీతులను యనంతమగు కథాకల్పనవైచిత్రములలో వికసింపజేసెను. ఈతని దృశ్యకావ్యములందు The eve of Saint John, Alladin మున్నగునవి పేరొందియున్నవి. ఈతను భావగీతములు, మహాకావ్యములు, పురాణములు పెక్కురచించి డెన్మార్కుజాతీయ కవిత్వమునకు మహోపకార మొనర్చెను. వీనితరువాత నచ్చటనే హెన్రిక్కు హెర్ట్జుఅనువాతడు 18 సంపుటములలో, లోకవిఖ్యాతకళానైపుణ్యమొప్పెడి నాటకములరచించె. అందు King Rene's daughter అనునది మిక్కిలి మెప్పొంది యున్నది.

ఆస్ట్రియాదేశమున గ్రిల్ పార్జర్ అను మహాకవియుదయించి గెటీ మున్నగు మహాకవులచ్చొరవగొని రూపకరచనములరచించి ఆస్ట్రియాదేశపు నవీనసారస్వతావిర్భావమునకు పోషకుడాయెను. ఈతనినాటకము లసమానసౌందర్యమొప్పారుచు నాలుగుభాషలసంతరింపబడినవి. అనేకదేశములలో బ్రిదర్శన గౌరవముం గొనినవి. వీనిలో (Sappho, A faithful servant, Waves of love, The dream of life) మున్నగు నవిప్రత్యేకముగ మన్నింపబడుచున్నవి.

19వశతాబ్దములో పాశ్చాత్యప్రపంచమందలి యన్నిదేశములందు విపరీతకవితావిర్భావములేర్పడి పత్రికాప్రచురణ సహా

ప్రౌనింగు మున్నగు మహాకవులు పలుతెరంగుల కావ్యక్రియా ప్రయోగము లొనర్చుచుండిరి. కాని నాటకరచన మాంగ్ల దేశమున జల్లబడినది. ఈ కవుల పోకడలందు లోతగు వేదాంతసూచనలు ప్రాచ్యభావముల సూచించి రవీంద్రాది కవుల రాకకు దారిచూపెడి రీతులు ప్రాచీనకళావిజయమా దభిమానము ప్రధానాంశములై యుండెను. ఆంగ్లదేశమున జన సామాన్యపు జీవితావస్థలు సాంఘికసమస్యలు కావ్యరూప కములందుకన్న డిక్కెన్సు, ఠాకరీ, ఇలియట్టు, గాస్కెలు ఆస్టెను మున్నగు మహాకథకుల రచనలందు బొడగట్టదొడగెను. ఫ్రెంచిదేశమున నీవిషయములే వీని యామోదమున నేర్పను నవీన భావవిస్తరణమార్గములతో సర్వతోముఖముగ కావ్యరూపక నవలాది రూపముల వికసించుచుండెను. ఇందు తొలుదొల్త బేరొందదగిన మహామహుడు వాల్మీకి సదృశకరుణాంత రంగుడు.

## XII

### విక్టరుహ్యూగో మహాకవి (1802-85)

కావ్యప్రపంచపు శిరోభూషణములలో నొకడు. వాల్మీకి, ఫర్దూసీ, డాంటీ, షేక్సుపియరు, గెటీ, సాఫోక్లీజు మున్నగు పేర్ల తో జేర్చి గారవింపదగిన మేటికవి. 1822లో కావ్య రచనమా రంభించి విపరీత కల్పనవైభవోద్వేగమున ననేక కావ్యములను గీతములను పద్యావళులనురచించిఅప్పటిప్రాను రాజగులా యీ చాల్లెను యభిమాన పోషణమనుభవించి 1827 లో ప్రజా స్వామ్యసాంఘికాదర్శము లుదయింప నాయేట క్రామ్వెల్ అను ఆంగ్లవీరునిచరితము దృశ్యకావ్యముగ రచించి దా

నికొక పీఠికను చేర్చెను. ఈపీఠికలో దేశకాలకథానియమములనాదేశించు ప్రాచీన రూపకలక్షణములతిరస్కరించి షేక్స్పియరవలంబించిన స్వతంత్రపద్ధతుల నామోదించి ట్రాజెడీకామెడీల విషాదహాస్యశృంగార సంధర్భములను అన్నిటిని మహానాటకములందు ఒక్కచోటకూర్చ యల్లవచ్చునను సిద్ధాంతమును ప్రతిపాదించెను. ఇందుమూలమున నీతడుపారిసునగరములో సాహితీవ్యాసంగమున పేరొందుచుండిన గాటియర్ ముస్సెటు సాన్‌బోవ, డూమామున్నగు నవ్యమార్గాన్వేషులచెలిమివడసెను. వీరందరుచేరి థియేటర్ఫ్రెంచియు మననాట్యశాలను శాసించుచు, ప్రాచీనరూపకలక్షణాంబుల రెగటార్చ యత్నించుచుండిరి. వీరినవ్యాదర్శముల నిదర్శించుకొరకు హ్యూగో 1829 లో Marion Delorme 1830 లో Hernani 1833 లో Lucrece Borgia, Mary Tudor అనురూపకములను సృజించి ప్రదర్శింపజేసెను. తరువాత ఈతని వ్యాసంగము చాలవరకు కథాకల్పన మందు చెల్లుచుండెను. హ్యూగో మానవస్వాతంత్ర్యము, సమానసుఖ జీవనము నీతివర్తనముదయాప్రవర్తనములు మొదలగునుదార జీవితాదర్శములనెలకొల్పయత్నించుచుండెను. లోకమానిత సద్గుణంబు లెన్నియో నీతనియందగుపడుచుండెను. వీని కావ్యము లందలి లోపములు కూడఈమ హాగుణభారమునను కలుగుచున్నవి. ఇతని నాటకములు షేక్స్పియరు పద్ధతినికావు. గానాపకాశములు లేనిఆపెరాలవలె మెలోడ్రామాల రీతిలోనుండెను.

వీనిసమకాలికులలో డూమా, మూసెట్టు, జార్జిసాండుము

న్నగు ఫ్రెంచికవు లెందరో రూపకముల రచించుచుండిరి. వీరిలో
మిన్నలగు అలెగ్జాండరు డూమా (1802—70) Monte
Cristo మాంటిక్రిస్టో మున్నగు నవలల రచించి లోకఖ్యాతి వ
డసియున్నాడు. ఈతను రచించిన Henry III, Charles VII,
La Tour De Nesle అను నాటకములు నవీననవలల కన్న నెక్కు
వ లోకజ్ఞానమును కథా చమత్కారమును భావభారమును కా
వ్యనైపుణ్యమును చాటుచున్నవి. ఈతని కుమారుడగు

ఛోటా డూమా (1824—95)

24 ఏండ్ల ప్రాయమున The Dame of Camelia అను
నవలను రచించెను. దీనిని రంగోచితముగ మార్చి ప్రదర్శింప
నద్భుతమగు రూపక లక్షణములిందగుపడెను. తరువాత నీ
తడు అనేక రూపకముల రచించి నవీనపంథాను రూపకరచయిత
లలో మేటియనుపేరు పొందియున్నాడు. నైతికసమస్యలను
జర్చించుటకు సంఘసంస్కార ప్రణాళికల బ్రవర్తింపజేయుటకు
నాట్యరంగ ముపయోగింపదగునని వీని యాశయము. La
Question De Argent మున్నగు డూమా నాటకములు సాం
ఘికసమస్యల సంపూర్ణముగ జర్చించుచు స్త్రీస్వాతంత్ర్యము
నకు తోడ్పడినవి. కథాకల్పనమందు చక్కని రంగోచితసం
దర్భముల గూర్పగల సామర్థ్యమొకటియు పొలుపారు శైలియు
నీనవరూపకములకు కావ్యసౌందర్యమేర్పరచుచున్నవి. లేని
చో నీతని నాటకములు సంఘసంస్కరణోపన్యాసములుగ దేలి
యుండెడివి. ఈతని నైతిక సంస్కరణాదర్శములు మిన్నయై
నను వీని సమర్థించుటకు గల్పింపబడిన యవస్థలు నీతిబాహ్య
ము గనసహ్యముగ, కొన్నితావుల భంగపడియున్నవి.

ఫ్రెంచికవి ఆగేరు (1820-89) ఆంగ్లకవిరాబర్టుసను (1829-71) సొసైటీయను నాటకమందును స్క్రైబుసార్డో అను నాతడు (1791-1861) సామాన్యసాంసారిక కథలలో రసవంత మగుగాథావిన్యాస మున్నట్టి నవీన సాంసారిక రూపకరీతులను విస్తరించియున్నారు.

కొపీ 1842-1908 అనుకవి పిట్టురుషాఖ్యాగ మొదలిడిన భావపద్ధతుల నందికొనియు రోస్టాండుకవి Cyrano De Bergerac 1897 అను రూపకమందును, మేటరులింకు Pelleas at Melisande (1892) అనునాటకమందును భావకవిత్వరీతులననువదించియున్నారు. వీరిభావపూరితకల్పనాకథలు నాటకకవిత్వమునకు క్రొత్తతళుకులతీర్చుచుండ సింగ్లాండు ఫ్రెంచిదేశములలో గృహస్థవిషయములను దెలిపెడి కామెడీలు హాస్యశృంగార రసభరితమైనవి బయలుదేరుచుండెను. స్క్రైబుసార్డోరచించిన నాటకములలో పెద్దపాయూడెలు బహుకలలో నొదిగియుండు నీచభాగములు వెలుగొందిజనరంజకముగ నేర్పడెను. కాని నాట్యకళకిందువలన నెట్టి శాశ్వతోపయోగముకలుగలేదు. ఫ్రెంచికామెడీలు అవినీతిని ఖండించుచున్నను భావప్రాబల్యమున నైతికాచరణ సదాదర్శముల నెలకొల్పజాలకుండెను. హెన్రీబెక్కు 1897-99 కాపసు (1858) హారిపూ (1857-1915) మున్నగు కవులందీసత్యము మిక్కిలిపిక్కటిల్లి ఫ్రెంచినాటకములనుండి రసప్రకోపసౌందర్యమెల్ల తొలగించివైచినవి. గ్వటేస్త్రియను అభినవకవి కొన్ని నిర్వేదనాటకముల రచించినను Pateur అను రూపకములో రసపోషణకు కొంత యవకాశమేర్పరచెను.

గాగాల్ (1809-5) అను రష్యా దేశపు నవలరచయిత Revior అను హాస్యరూపకము రచియించి యున్నాడు ఇందు రష్యా దేశపు సాంఘిక స్థితులు పరిహాసింప బడినవి.

క్రాసిన్స్కీ (1812-59) అను పోలెండు కవీంద్రుడు. Undivine comedy అను లోకఖ్యాత రూపకము రచించి యున్నాడు.

ఆంగ్లకవి జేమ్సుబెయిలీ (1819 1602) గెటీరచించిన ఫాస్టునాటకమును పాశ్చాత్త్యరూపున వ్రాయుదలచి 1839 లో Festus అను స్వతంత్రనాటకమును రచించెను. ఇది తొలుదొల్త గారవ మొందిన కాలక్రమమున నందులో తరువాతఁ జేర్పబడిన నైతికమతవేదాంత తత్త్వబోధనలతో బలువెక్కి రస విహీనమై యక్లికపాండిత్యలు మనుగుపడి ప్రదర్శనమున కుపయోగింపని కావ్యమైనది.

గస్టెవుఫ్రైటాగు (1816-95) అను జర్మనుకవి. Debit & Credit అను రూపకము రచించెను. ఇందు ధనికుల సంసారములు చిత్రింపబడి యున్నది.

ఎమిలీఆగేయర్ (1820-89) అను ఫ్రెంచినాటకకవి నవీన సంఘాచారములను స్వభావవైశద్యముతో నాట్యరంగమున నగుపరచు నాటకములను కల్పించిన మొదటి సాహసులలో నొకడు. మొట్టమొదట లక్షణమార్గములో Lacigue మున్నగు పద్యనాటకములు రచించి యావల Les Effrontes మున్నగు గద్యరూపకముల వ్రాయనొడగెను. అనువగు పాత్రస్వభావ నిరూపణము వెనుదీయని నీతిపటిమ సంఘపరిహాసము వీని రూపకములందు గోచరించెడి ముఖ్యలక్షణములు.

ఆస్ట్రొవిస్కీ (1823-96) అను రషియా దేశపునాటకకవి మాస్కోనగరమందు నివశించెడి చిల్లరవర్తకుల జీవితాంశముల గైకొని The Storm, The Bankrupt మున్నగు వన్నెగల నాటకములరచించియున్నాడు. ఈతనుమాస్కోనాట్యశాలకు కార్యనిర్వాహక సహాయుడుగానుండెను.

ఆచాగరే (1832-1916) అను స్పెయినుదేశపు కవిరాజ్య తంత్రజ్ఞుడు వేదాంతి అన్నియుకలసినమహామతి ఎనుబదినాటకములరచించియున్నాడు. యివియన్నియు యూరపులోని దేశభాషలలో పరివర్తింపబడినవి. ఈతను 1904 లో నోబుల్ బహుమానమొంది స్పెయినుదేశపు నవీన కావ్యోద్యమమున నాయకమణియై వెలుగుచున్నాడు. ఇతని నాటకములలో Mariana, Elgran Galeots మిగుల పేరొందియున్నవి.

XIII

ఆధునికనాటక కవిత్వము.

హెన్రిక ఇబ్సను (1828-1906)

నార్వే దేశీయుడు. చిన్నతనమున కొన్ని యిక్కట్టుల జిక్కి కష్టములనుభవించి 1819 లో కొన్ని భావగీతములను సామెతలను, సూత్రములను ప్రచురించెను. ఆవల విద్యాభ్యాస మొనర్పనెంచెనుగాని నాట్యరంగ మాతని నుత్సాహ పరవశుగాజేయ 1850 లో Catilino అను నాటకమును రచించెను. దీనివలన బర్గెనులోని ప్రధాన నాట్యశాలలో రూపకరచన మొనర్ప నియమింపబడెను. తరువాత 1857లో యిబ్సెనుకిృష్టియానియా పట్టణములోని నార్వేజాతీయనాట్యశాలయాధ్యక్షుడుగ నియమింపబడెను. 58 లో The warriors

of Helgeland అను నాటకమును నార్వే దేశపు తొల్లిటి వీర గీతముల ననుసరించి రచించెను. తరువాత నొక ప్రహసనము వ్రాసి ప్రజాద్వేష మనుభవించి ప్రవాసుడై ఇటలీ యందు కొంతకాలము సంచరించి డ్రెస్డెను మ్యూనిక్ పట్టణములలో కాలయాపన మొనర్చుచుండెను. ఈతనినాటకములలో Emperor, Galilean, Pillars of Society, Doll's house, Ghosts, Wild duck, Master builder, When we dead awaken అనునవి ప్రధానగౌరవ మొందుచున్నవి.

ఇబ్సెను మానవజాతినంతను పరిహాసించెనేగాని నార్వేలోని దురాచారములు మాత్రమే ఖండించియుండలేదు. కాని మానవస్వభావ సామాన్యమగు హాస్యసందర్భముల గైకొనిన రూపకల్పనమందు తానెఱింగిన స్వదేశీయుల బాహ్యరూపములనే చిత్రింపవలసి వచ్చెను. ఇబ్సెను మహాకవి నాటకరచనమందు క్రొత్తదారుల నెట్టియున్నాడు. ఇతని ప్రతిభావిశేషములు సార్వత్రికోపయుక్తములని తెలిసికొనుట కెంతయో కాలము పట్టినది. మొట్టమొదట నీతని రూపకకావ్యపఙ్క్తులు నార్వేదేశపు భాషయందొప్పునట్లు యితరభాషలలో వెలువొందవని భ్రమపడుచుండిరి. కాని బర్నార్డుషా 1891 లో "ఇబ్సెను నాటకముల తళుకుబెళుకులు" అను విమర్శగ్రంథము ను రచించియు ఎడ్మండుగాసే వీనికనేక అభినందన వ్యాసాంజలుల నర్పించియు వీనిప్రభావ మాంగ్ల దేశమున జేర్చిరి. విలియమ్సు ఆర్చరు అను నాటకవిమర్శకుడు ఇబ్సెనునాటకముల నాంగ్లీకరించి యున్నాడు.

ఇబ్సెను రచించిన Peer Gynt, Brand అను నాటక

ములు కావ్యప్రధానములై యున్నవి. తరువాత నితడు ప్రహసన జాతీయములఁ జీవకళలుట్టి పడ నేర్పరచెను, తుదకుభావ సంకేతికములగు నాటక పాత్రలను గల్పించెను. స్వభావ చిత్రీకరణ మందీతడు చూపిన లోతుచూపుకులు జీవించియున్న వ్యక్తి స్వరూపముల బింబీకరణము మిక్కిలి దుస్సహముగ నుండెను. కానికథావిన్యాసమందు స్వగతములను విష్కంభాది ప్రస్తావనలను త్రోసిపుచ్చి కథాంశపు విపరీతావస్థతో మొదలిడి కాలక్రమమున జరిగిన జరగనున్న వృత్తాంత మంతయు వెలువడునట్లు నేర్పుమై యల్లియున్నాడు. ఈ తెలివి Rosmersholm అను రూపకమందు సంపూర్ణ వికాసమొందియున్నది.

ఇంగ్లాండులో రాబర్టుసను రచించిన కామెడీల ననుసరించి సర్ ఆర్థరుపినేరో 1855- ఇబ్సెను ప్రభావ మొకింత జవిజూచియు 1889 లో Profligate అను నాటకమును రచించెను. అందు సాంసారిక కథారూపకము మామూలు గొడవ కన్న నెక్కువ భావగాంభీర్య మేర్పడి క్రొత్తదిలో ఇబ్సెను రూపకముల బోలియుండెను. పదంపడి ఈ కవి His house in order అను రూపకమునకు ఇబ్సెను నైజమునకు కథాకల్పన చాతుర్యమును పాత్రపోషణ పద్ధతులను వెలిగించి చూపెను. అనేకులు ఇబ్సెను ననుకరింప యత్నించిరి కాని లాభ మెక్కువకనపడనందున ఇబ్సెను రీతులం దేవగింపుజరించినది.

హెన్రీ ఆర్థరుజోన్సు (ఆంగ్లకవి 1851-) 19 వ శతాబ్దపు మెలోడ్రామాను అనుసరించి The Silver King మున్నగు కామెడీల మూటనిరచించెను. ఇందుల బరిహాసింపబడిన సాంఘిక విషయములు జాతీయ సత్వమొప్పుచు విషయమై శా

ల్యమున భాషాసామర్థ్యము నటంకరిత్వము నైతికదౌర్బల్యము పటాటోపము దురభిమానము మున్నగు నీచలక్షణముల పవిత్రిదర్శనములతో ఖడించు చురుకు తెలుకున వానికెక్కయున్నది.

## మారిసు మేటర్లింకు 1862.

బెల్జియము దేశపు మహాకవి 1889 మొదలు నలుబది నాటకములను కావ్యములను రచించి 1911 లో నోబుల్ బహుమానమును పొందియున్నాడు. ఈతని నాటకములు కీలుబొమ్మలాటలకొరకు ప్రధానముగ వ్రాయబడినవి. ఇతని గద్యము పద్యసాదృశ్యమున మాధుర్యముల పదసంపత్తియై చక్కగ ప్రవహించుచు నిర్మాణకౌశలంబగు నుత్కృష్టరస నిరూపణమునద్వితీయ సౌకర్య మేర్పరచుచున్నది La princes Melene, Mona Vanna Betrothal మున్నగు నతని నాటకము లితని కళాపద్ధతుల దెలుపుచున్నవి. మానవ జీవితమందు వ్యక్తమగు నవ్యక్తరహస్యముల దెలిసికొనుటకు కితడు యత్నించుచుండును. కొన్ని నాటకములలో నవ్యక్తసూచనలకు ప్రాముఖ్యము కల్పన మొనర్చి నాటకాభివృద్ధి నేర్పరచును. ఇతని పద్ధతులు ఉత్ప్రేక్షాదూషితములనియు, సాంకేతికములనియు భావసూచకములనియు పలువిమర్శకుల ఖండింపబడినవి, ఈతని నాటకములలో కథావస్థల నేర్పడుచేష్టా సంచలనము చాలవరకు తగ్గింపబడినవి. అవస్థలు సూచింపబడునేకాని అభినయాంశముగా ప్రదర్శింపబడవు, మానస సంచారమై ఘటులు ముఖ్యముగ నాత్మికానుభవము నేర్పరచు ప్రశాంతచిత్తవృత్తులు మాటర్లింకు నాటకములందు చక్కగ నిరూపింపబడినవి.

